# రాగజ్వాల

(నాటిక)



రచన :

శ్రీ కొడాలి గోపాలరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం

విజయవాడ-2

# పాత్రలు

రంగనాథం

శేషు

అప్పయ్యశాస్త్రి

రాధ

కాలం : వర్తమానం.

: రంగస్థలం :

— తెర —

[అది రంగనాథం గృహం. వరండాహాలు. హాల్లో మధ్య ద్వారం. లోపల పడకగది. ఎడంవైపు వంటగది. బైటద్వారం అన్ని ద్వారాలకు డోర్ కర్టెన్సున్నాయి. ఒక నవ్వారుమంచం ఒక పడక్కుర్చీ, రెండు సూటుకేసులు. ఒక కోటుస్టాండు, దానికి కొన్ని బట్టలుగా తగిలించి ఉన్నాయి. ఒక సైకిలుంది. మధ్య ద్వారంవైపు ఒక ఫోటోలో రంగనాథం, అతని భార్య రాధ ఉన్నారు. శేషు బయటనుండి లోని కొచ్చాడు. కుంటి కాలు, రెండు చంకల క్రింద ఊతకర్రలు. జుట్టంతా సంస్కార హీనంగా రేగివుంది. గడ్డం పెరిగింది. అక్కడక్కడ చిరిగి మాసికలు వేసిన మిలటరీ దుస్తులు. వయస్సు 40 వత్సరాలు. శేషు లోపలికి వచ్చి, నవ్వుతూ తాళపుచెవుల గుత్తి జేబులో వేసుకున్నాడు. ఇల్లంతా కలయజూస్తూ మధ్య వాకిలిగుండా పడగ్గదిలోకి వెళ్ళాడు. తిరిగివచ్చి వంటగదిలోకితొంగిచూశాడు. సూటుకేసు తెరవడానికి ప్రయత్నించాడు. అది రాలేదు. వెళ్ళి పడక కుర్చీలో కూర్చున్నాడు. చుట్ట తీసి ముట్టించాడు నాజూగ్గా పొగవదుల్తూ ద్వారంవైపు చూశాడు. రాధా, రంగ నాథంల ఫోటో కనిపించింది. చివ్వున లేచి కర్రతో ఆ ఫోటోని పడగొట్టాడు. పడిన ఫోటోని కర్రతో అద్దాన్ని పగలగొట్టి ఫోటో చేత్తో అందుకొని ఫ్రేముచిరిచి అవతల పారేసి, రాధ వున్న భాగాన్ని చించి జేబులో వేసుకొని, రంగనాథం వున్న

భాగాన్ని చించి ముక్కలు చేశాడు. ఇంతలో బయటనుం నవ్వులు వినిపించాయి. నవ్వులాగిపోయాయి. తర్వాత మాటల వినిపించాయి.]

రంగ : రాధా ! తలుపుతీసుందేమిటి?

రాధ : ఇందాక మీరు తలుపు వేశారా!

రంగ : వేశాను...

రాధ : వేస్తే ఎందుకు తీసుంటుంది. మీరు మర్చిపోయ రేమో!

రంగ : లేదురాధా ! చాలా విచిత్రంగా ఉందే...పద, ప

[ఇద్దరూ లోపలికి వచ్చారు. రాధ చేతిలో బట్ట పాకెట్ ఉంది. రంగనాథం చేతిలో యాపిల్ పండ్లు, ఫ్రూ ఫోట్లాం వున్నవి. ఇద్దరి వయస్సు ఇంచుమించు 25, 30 స ఉంటాయి. వాళ్ళిద్దర్నీ చూడగానే శేషు పెద్దగా నవ్వాడు రాధా, రంగనాథం క్షణకాలం స్థంభించిపోయారు...]

రంగ : ఓ ... నువ్వా !

రాధ : పాడుపీడ, మళ్ళీదాపురించింది [రాధతలవంచుకొ వంటింట్లోకి వెళ్ళింది. రంగనాథం తేరుకొని]

రంగ : మళ్ళీ ఎందుకొచ్చావు. డబ్బుకోసమా ? ఉండు .

[రంగనాథం విసుకుగా సూట్ కేసు దగ్గరకు వెళ్ళాడ శేషు కుర్చీలో కూర్చొని జేబులోనుండి బ్రాంది బాటిల్ తీ

రెండు గుక్కల్లో తాగేశాడు. రంగనాథం పాంటు జేబులు వెతికి తాళాలు లేవని తెలుసుకొని వంటగదిలోకి వెళ్ళాడు.] ఆ సూట్ కేసు తాళంచెవులిలా తే.

రాధ : మళ్ళీ డబ్బిచ్చి పంపుతారు.

రంగ : ఏం చేయమంటావ్...తప్పదు.

రాధ : ఈ డబ్బుతో ఈ శని విరగడౌతుందని నమ్మకమేమిటి?

రంగ : పోనీ, నిన్ను దానం చేయమంటావా?

రాధ : ఇవిగో

[బయటకు వచ్చాడు. సూట్ కేసు తెరిచి వందరూపాయలు లెక్కబెట్టి పర్సులో పెట్టి, పర్సు శేషుపైకి గిరాటు వేశాడు. శేషు నవ్వుతున్న పర్సును రెండుచేతుల్తో ఎగిరిపట్టుకొని నవ్వుతూ జేబులో వేసుకున్నాడు. రంగనాథం కోపంతో...]

రంగ : ఇక వెళ్ళు...

[శేషు మాటాడకుండా లేచి, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, టేబుల్ మీద యాపిల్ పండు అందుకొని, ఎగరవేసి పట్టుకొని సగం కొరికి తింటూ, మెల్లగా బయటకు వెళ్ళాడు. రంగనాథం కోపం పట్టలేక వాకిలి వరకు శేషు ననుసరించాడు. రాధ లోపలినుండి విసురుగా వచ్చి, రంగనాథం చెయ్యి పట్టుకొంది.]

రాధ : శాంతించండి...

రంగ : ఈ కొంపలో శాంతికూడా తగలడింది.

రాధ : నన్నేం చేయమంటారు?

రంగ : నా గొంతు కురిపొయ్యమంటాను...

[శేషు మళ్ళీ వెనకగా వచ్చాడు. వాళ్ళిద్దరూ చూడ లేదు. రాధ మెళ్ళో నెక్లెస్ తెంచుకొన్నాడు. రాధకెవ్వుమంది. శేషు పెద్దగానవ్వాడు. రంగనాథం కోపం పట్టలేక...]

రంగ : స్కౌండ్రల్...

[సైకిల్ వరకూ పరుగెత్తి సైకిల్ పట్టుకొని వాకిలి వైపు వెళుతున్నాడు. రాధ అడ్డుగా పరుగెత్తి రంగనాథం కాళ్ళు పట్టుకొని ఏడుస్తూ కూలబడింది]

రాధ : నా మాట వినండి.

రంగ : విడిచిపెట్టు. ఇవ్వాళవాణ్ణి బ్రతకనివ్వను.

రాధ : నన్ను చంపండి ఈ తప్పునాది.

రంగ : అయితే, ఆ నెక్లెస్ వదులుకోవడమేనా?

రాధ : పాడు నెక్లెస్, పోతేపోనివ్వండి.

రంగ : ఇవ్వాళ నెక్లెస్ తీసికెళతాడు. రేపు బలవంతంతో నిన్ను తీసుకొని వెళతాడు.

రాధ : అతని తరంగాదు.

రంగ : నమ్మకవేవిటి?

[సైకిల్ పంపు విసిరవతల పారేసి, తలపట్టుకొని కుర్చీలో కూలబడ్డాడు. రాధ వెళ్ళి అతని కాళ్ళదగ్గర కూర్చొని ఏడుస్తూ...]

రాధ : పాపిష్టిదాన్ని ఇదంతా నా వల్లనే. మిమ్మల్ని ప్రేమించి మీ జీవితంలో ప్రవేశించి, మిమ్మల్ని అగ్ని సాక్షిగా వివాహం చేసుకొని...

రంగ : ఇప్పుడా కథంతా ఎందుకు? నీ వేలాంటిదానవో నాకు తెలుసు. నీకోసం నా వాళ్ళందర్నీ విడిచిపెట్టుకున్నాను. కులం గోత్రం మంటకలుపుకున్నాను. ప్రేమకన్నా ఈ ప్రకృతిలో పవిత్రమైనదేదీ లేదని భ్రమించాను. అను రాగ హృదయాలేకమైతే, అమృతమే వర్షిస్తుందను కున్నాను. కాని మొగలిపూవులో మిన్నాగుంటుందని తెలుసుకోలేక పోయాను. రాధా! ఈ బాధల్ని నేను భరించలేను. మనమెక్కడికన్నా వెళ్ళిపోదాం. ఇక్క ణ్ణించి వెళ్ళిపోదాం. ఎవరికీ తెలియని చోటికి, ఏ బాధలూ లేని చోటికి, ఏ దూరతీరాలకో వెళ్ళిపోదాం...

రాధ : ఎక్కడకు వెళ్ళినా శేషు మనల్ని విడిచిపెట్టడు.

రంగ : ఎంతదూరం రాగలడు?

రాధ : పగబట్టిన పామెంత దూరమైనా వస్తుంది.

రంగ : దాని తల చితక్కొడతాను.

రాధ : కొట్టి, ఆ నేరంతో మీరు జైలుకు వెళతారు. అంతేనా?

రంగ : ఈ నరకం కన్న అదేనయం.

రాధ : నా మాట వినండి.

రంగ : ఇక నేను వినదల్చుకోలేదు.

రాధ : మీకు పుణ్యముంటుంది. నన్ను కోర్టు కీడ్పించకండి.

రంగ : మరెలా ! మనం సుఖంగా బ్రతకటమెలా ! క్షణకాల మైనా శాంతిననుభవించడమెలా?

రాధ : పోనీ ఒకటి చెబుతానువింటారా?

రంగ : ఏమిటి ?

రాధ : నన్ను విడిచిపెట్టండి.

రంగ : ...రాధా!...

రాధ : మీ యింటికి వెళ్ళిపొండి. మీరైనా సుఖంగా ఉండండి.

రంగ : నావల్లగాదు.

రాధ : మనస్సు మార్చుకోండి. గుండెనిరాయిచేసుకోండి.

రంగ : నీకు తెలిసే మాటాడుతున్నావా?

రాధ : ఆఁ...ఈ రాధ చచ్చిపోయిందనుకోండి.

రంగ : నాతోటి తెగతెంపులు చేసుకుంటున్నావా?

రాధ : నేను తెంచకపోయినా అతనుంచడు.

రంగ : ఉంచకపోతే వాడుండడు.

రాధ : నా కోసం మీరు చనిపోవడం నేను సహించను. నన్ను విడిచి పెడితే మీరైనా సుఖంగా ఉంటారు. వెళ్ళి పోండి.

రంగ : ఈ మాట వాడితోనే ఎందుకు చెప్పలేవు.

రాధ : అతను వినడు.

రంగ : లేదు. నువ్వు చెప్పలేవు. బాంధవ్యాన్ని విడిచిపెట్టలేవు. నేను పరాయివాణ్ని.

రాధ : ఎందుకు శూలాల్లాంటి మాటల్తో నా గుండెలు పొడుస్తారు. నేను మిమ్మల్ని ప్రేమించింది అబద్ధమంటారా ? మిమ్మల్ని పెళ్ళిచేసుకున్నది అబద్ధమంటారా ? మీ రేనేననేది అబద్ధమంటారా ?

రంగ : మరీ యెడబాటుకు అర్థమేమిటి ?

రాధ : స్వార్థం ప్రేమను చంపుతుంది. త్యాగం ప్రేమను పెంచుతుంది. వెళ్ళండి.

రంగ : రాధా ! వెళ్ళను ! వెళ్ళలేను! నిన్ను విడిచి బ్రతకలేను. ఈ జీవితాంతం నీవు నా జీవితంలో తోడుగా నీడగా ఉంటావనీ; నువ్వే నేనై బ్రతుకుతామనీ ఎన్నో కలలు గన్నాను. అవన్నీ నాశనంచేసుకొని, వెళ్ళిపొమ్మంటావా ! నేను నిన్ను వివాహంచేసుకున్ననాడే, నా తల్లిదండ్రులు, కడుపుతీపి తెంచుకున్నారు. కులాన్నీ భార్యనూ పోగొట్టుకొని, నేనెలా వెళ్ళను? ఎలా బ్రతకను చెప్పురాధా ! నన్నే ప్రేమిస్తూన్నానని చెప్పు ! నన్ను విడిచి వెళ్ళనని చెప్పు. నాకంటే నీకీలోకంలో ఏమీ లేదని చెప్పు. నీ మనస్సు మార్చుకోనని చెప్పు.

రాధ : నేనేంచెప్పినా మీ మంచికోరే. . .ఒకటి చెప్పుతాను

వినండి. కొందరు విషం త్రాగికూడ జీవిస్తారు. కొందరు అమృతం త్రాగికూడ మరణించే అదృష్టహీనుల్లో నే నొకదానిని...(లోనికి వెళ్ళింది) (రంగనాథం కూలబడి తలపట్టుకున్నాడు. రాధ తిరిగివచ్చి చూచి, లోపలికి వెళ్ళింది. రంగనాథం లేచి విసుకుగా బయటకువెళ్ళాడు. ఒకక్షణంతర్వాత శేషు తిరిగివచ్చాడు. ఈసారి చలి జ్వరంతో గడగడ వణుకుతున్నాడు. వచ్చి కుర్చీలో కూలబడ్డాడు. బాధతో మూలుగుతున్నాడు. రాధ లోపలనుండి కాఫీ తీసుకువస్తుంది. చూచింది, విసుకుగా లోపలకు వెళ్ళింది. కట్టెపేడుతో తిరిగివచ్చింది. కట్టె పేడు పైకెత్తి తలమీద కొట్టబోయింది. కాని కొట్ట లేకపోయింది. శేషు, రాధవైపు దీనంగా చూచి జాలిగా నవ్వాడు)

శేషు : ఆగావేం, కొట్టు !

రాధ : ఛీ ! సిగ్గులేనిజన్మ !

శేషు : ఈ జన్మ కడతేర్చి పుణ్యాం కట్టుకో !

రాధ : నన్నిలాగే వేధిస్తావా ?

శేషు : దయచూపటం నాకు చేతకావటంలేదు.

రాధ : అయితే చంపరాదూ !

శేషు : అప్పుడేనా ?

రాధ : అంతవరకూ ఇలా చిత్రహింస చేస్తానంటావ్ !

శేషు : ఇప్పుడా గొడవలన్నీ ఎందుకు ? చలిజ్వరం భరించలేకపోతున్నాను. రగ్గుఉంటే తెచ్చిపెట్టు.

రాధ : లేదు.

శేషు : ఉందో లేదో నాకు తెలియదు; రగ్గులేకపోయినా నీకు హృదయం ఉంది; ఈ బాధనుండి నీవు తప్పించాలనుకుంటే...

రాధ : ఎందుకు తప్పించాలి ?

శేషు : నీయిష్టం. బలవంతం ఏమీలేదు. ఇది నీయిల్లు. పూర్వం రోజుల్లో అయితే, నన్ను చూడగానే ఎగిరి గంతులేసేదానివి. నేను అడక్కుండానే అన్నీ ఇచ్చేదానివి. ఇప్పుడు నేనంటే నీకు అసహ్యం. అవునా ?

రాధ : అవును.

శేషు : నాకు తెలుసు. అబ్బ ! పోనీ డాక్టరునైనా పిలిపిస్తావా? నాకీ ప్రపంచంలో ఎవరూలేరు నీవుతప్ప. నీకన్నా నాకెవరూ ఆప్తులులేరు. నా మంచిచెడ్డలు నీతోనే చెప్పుకోవాలి... దేనికేడుస్తావ్ ... నే చావలేదనా ? చావాలనే ఉంది. చావురావటంలేదు, ఏంచేయను ? కుంటివాణ్ణి, ఒకరిమీద ఆధారపడి బ్రతకవలసినవాణ్ణి. నిజమే ! నీసుఖాన్నీ, నీడబ్బునీ దోచుకొని నీవు 'ఛీ' అన్నా 'ఛా' అన్నా నీచాంతినీచంగా బ్రతుకుతున్నాను. (రాధ మాట్లాడకుండా లోనికివెళ్ళి రగ్గు తెచ్చికప్పింది.)

శేషు : చూడురాధా, వేడివేడిపాలుగాని, కాఫీగాని త్రాగాలని ఉంది.

రాధ : అలాంటివేమీ ఇక్కడలేవు.

శేషు: ఉన్నాయనికాదు; ఉన్నచోటుకు వెళ్ళి తెచ్చుకొనే ఓపికలేక, అడిగాను. పోనీలే! ఇప్పుడు నీమొగుడు వచ్చి, ఇవన్నీ చూచి నిన్ను చంపుకుతినడం దేనికి? అతన్ని చూచి నీవు భయపడుతున్నావు. ఉన్నా లేవని చెప్పుతున్నావు. నాకు తెలుసు. పోనీ విషం తెచ్చిపెట్టు! పెట్టగలవా? (రాధ మాట్లాడకుండా లోనికి వెళ్ళింది. పాలు తెచ్చి అందించింది. త్రాగి గ్లాసు అందించాడు. జేబులోనుండి చుట్టతీసి, జేబుతడుముకొని)

శేషు : అగ్గిపెట్టె!

రాధ : (లోనికివెళ్ళి అగ్గిపెట్టె తెచ్చి విసిరివేస్తుంది.)

శేషు : చూడురాధా! నేనుండటంవల్ల నీవు చాల బాధపడుతున్నావ్! నిన్ను పోషించేవాడు, నీపై సర్వాధికారాలు గలవాడు విడిచిపెడతాడేమోనని దిగులుపడుతున్నావు– నీవు అసహ్యించుకోలేవు.

రాధ : ఏమిటీ అర్థంలేని వాగుడు.

శేషు : నాజీవితానికే అర్థంలేదు; మాటలకెలా ఉంటుంది.

బాధపడకు. నేను వెళ్ళిపోతున్నా. (రెండుఅడుగులు వేశాడు, మళ్ళీ వెనక్కువచ్చాడు.) చూడు రాధా !

మననేవ మనుష్యానామ్
కారణం బంధమోక్షయో !

ఈపాడుబంధం త్రెంచుకుందామన్నా త్రెంచుకోలేం. ఎందుకు తెగడంలేదో నీకూ తెలుసు. సరే ! వస్తా ! (రగ్గుతోనే వెళ్ళిపోతున్నాడు. రంగనాథం వాకిట్లోనే ఎదురౌతాడు. చురచురా చూశాడు.)

రంగ : రగ్గుకూడ ఎత్తుకుపోతున్నావా ?

శేషు : ఏం ! ఎత్తుకువెళ్ళితే ! నారాధను నీవు ఎత్తుకురాలా ? (రంగనాథం మాట్లాడకుండా కూర్చుంటాడు. శేషు బయటకు వెళ్ళిపోతాడు. రాధవచ్చి, భర్తనుచూచి లోపలకు వెళ్లి కాఫీ తీసుకువస్తుంది...)

రాధ : కాఫీ తీసుకోండి.

రంగ : కాఫీకాదు, విషం తెచ్చిపెట్టు.

రాధ : ఇప్పుడు చాలామందీ విషమే తింటున్నారు.

రంగ : మరి నీవెందుకు తినవూ ?

రాధ : తినేరోజు రాలేదు.

రంగ : తింటావా ?

రాధ : మీకందరికీ ఇష్టమైతే !

రంగ : అందరంటే...వాడికూడానా ?

రాధ : వాడేమిటి ? పేరుందిగా పిలవరాదూ ?

రంగ : పేరుకాదు, నీకు అభిమానం ఉంది.

రాధ : ఉంది.

రంగ : ఆమాట సూటిగా చెప్పి ఏడవరాదూ !

రాధ : నేను ఇప్పుడు చెప్పినా మీరు నమ్మరు.

రంగ : ఇంకా నన్ను నమ్మించాలనీ, మోసంచేయాలనీ !

రాధ : నే నెవరినీ మోసంచేయటంలేదు; నన్ను నేనే చేసుకున్నాను. పాడుభగవంతుడు, నాకు ప్రేమించే హృదయం ఇచ్చాడుకాని, ప్రాణంతీసే కఠినత్వం ఇవ్వ లేదు. మీరన్నమాట యదార్థనే ! మొగిలిపూవునని నన్ను కట్టుకున్నారు. మిన్నాగై మిమ్మల్ని కరుస్తున్నాను.

రంగ : నీవు చూచి ఆనందిస్తున్నావు.

రాధ : మీ రెలా అనుకున్నా నాకు ఇబ్బందిలేదు.

రంగ : రాస్కెల్; ఏమిటె నీవు వాగేది. (అప్పటికే రాధ లోనికి వెళ్లిపోయింది. రంగనాథం వాకిలిదాకా వెళ్లి ఆగిపోయాడు. బయటనుండి అప్పయ్యశాస్త్రివచ్చాడు. కాషాయవస్త్రాలు, సన్యాసము పుచ్చుకున్నట్లు అతని వేషంలోనే కనబడుతుంది. చంకలో మూటఉంది.

తండ్రిని చూడగానే, బావురుమని ఏడుస్తూ, 'నాన్నా' అంటూ కాళ్ళను పెనవేసుకుపోయాడు. శాస్త్రి చంకలో మూట జారిపోతుంది...)

శాస్త్రి : (కొడుకు తలనిమురుతూ...) నన్ను చూచి దుఃఖ పడుతున్నావురా! వద్దు, దుఃఖం మహా చెడ్డది. దుఃఖాన్ని, సుఖాన్ని జయించినవాడే మనిషి!

రంగ : మీరు సన్యాసం స్వీకరించారా నాన్నా!

శాస్త్రి : స్వీకరించకపోతే నాకేముంది? నీదారి నీవుపోయాక, నీతల్లికూడ నన్ను విడిచి పరలోకానికి వెళ్లిపోయింది.

జాయాదుఃఖం, జన్మదుఃఖం,
పితాదుఃఖం, సుతాదుఃఖం
సతీదుఃఖం, పునఃపునః.

ఈ శ్లోకార్థం నీకు తెలుసా?

రంగ : తెలియదు నాన్నా!

శాస్త్రి : అవును. నీవు వేదం చదవలేదు. శాస్త్రం చదవలేదు. కిరస్తానీభాష నేర్చుకున్నావ్; కిరస్తానీదాన్ని కట్టు కున్నావ్, నీకు మడీ, మైలా లేదు; మంచీ చెడ్డలూ లేవు. తల్లిదండ్రులు లేరు; కులం గోత్రం లేదు. నీవు ప్రేమించిన, ఆ క్రిష్టియన్ పిల్లే నీకు అన్నీను. అందుకే అన్నీ విడిచిపెట్టావు.

రంగ : తప్పుచేశాను నాన్నా! నన్ను మన్నించండి. నాకు

ప్రాయశ్చిత్తం యిప్పించండి. నన్ను మళ్ళీ మీ బిడ్డగా మీ కౌగిట్లోకి చేర్చుకోండి !

శాస్త్రి : ఆ అనుబంధాన్ని త్రెంచుకున్నాను. ఆ బంధాల్లో ఉన్నన్నాళ్ళూ, నా భార్యా, నా బిడ్డలూ, నా స్వార్జితమూ, నాపరువూ, నా ప్రతిష్టా అని ఏడ్చాను. ఇప్పుడు వేటిదారి అదే అయింది. నా బ్రతుకే ఏటిపాలయింది. ఇక బ్రతుకు పండించాలనీ, బాధలను కూడకట్టుకోవాలనీ లేదు. అయోగ్యుడైన కొడుకును కని, తలకొరివికి కూడ మీ తల్లి నోచుకోలేకపోయింది. నేను ఉత్తముడైన కొడుకునేకంటే, ఉత్తరకర్మలు ప్రాప్తించి ఉండేవి.

రంగ : నిజమే నాన్నా నేను అంధుణ్ణి, అజ్ఞాని, మీ మాట పెడచెవినిపెట్టి, ఈ పెళ్ళిచేసుకున్నాను. అమ్మ మరణించిననాడుకూడా కడసారి చూడలేకపోయాను. నాన్నా ! నన్ను క్షమించాననీ, నా తప్పులు క్షమించాననీ ఒక్కమాట అను. నన్నుకూడా మీతోబాటు ఏ పుణ్యతీర్థాలకో తీసుకుపోండి.

శాస్త్రి : నీవింకా సన్యాసంపుచ్చుకుని, పరిణతి పొందలేవు. నీవందుకు అర్హుడవు కావు. క్షణికోద్రేకములో నీవీ భవబంధాలను త్రెంచుకుంటానన్నా నేను నమ్మేవాణ్ణి కాదు.

రంగ : లేదు నాన్నా నా మాట నమ్మండి ! నా బ్రతుకే శూన్యమైపోయింది. నా ఆశలు అడుగంటినవి.

శాస్త్రి : పిచ్చివాడా ! యౌవ్వనం చావందే ఆశ లెలా చస్తాయిరా ! ఈవేళవి చచ్చినవి అనుకున్నా రేపు మళ్ళీ మోసులెత్తుతవి. నీబుద్ధి నాకు తెలుసు. ఇదిగో ఉన్న ఆస్తి అంతా అమ్మివేశాను. మీఅమ్మ ఉత్తర క్రియలకు, ధర్మకార్యాలకు పోగా మిగిలిన ఈ ఏడు వేల రూపాయలు తెచ్చాను. తీసుకో !

రంగ : నాకక్కరలేదు.

శాస్త్రి : తీసుకో ! నేనుమాత్రం ఏంచేసుకొనేది; నీకు అక్కర్లేకపోతే దానధర్మాలు చేయి, నీ యిష్టంవచ్చినట్లు చేసుకో ! వాటిని ఇక నేను అంటుకొనే అర్హత లేదు.
[రాధ లోపలినుంచి వచ్చి **చూచి**, వినుగా కాళ్ళ మీద పడింది.]

రాధ : మీఅమృతహస్తంతో మమ్మ దీవించండిమామయ్యా!

శాస్త్రి : (దీవిస్తూ) సర్వేజనా సుఖినోభవంతు ... నీవేనా మావాణ్ణి కట్టుకుంది.

రాధ : అవును.

శాస్త్రి : **చూడమ్మా**! మీరిద్దరూ జీవితప్రాంగణంలో ఇప్పుడే ప్రవేశించారు. కులం ఏదైతేనేం, మీగుణాలుఒక్కటే. జీవితం మహాభయంకరమైంది. బ్రతుకును జయించిన వాళ్ళు లేరు. గంగావైతరణిలా మీరిద్దరూ ఏకమైనారు. క్షుద్రమైన ఈ కలికాలంలో నీతి ఇదేనేమో. నీచేతికి వాణ్ణి మేము అప్పగించకున్నా, నీవే అప్పగింతలు పెట్టు

కున్నావు. సున్నితమైన వాడిహృదయాన్ని గాయపర చకు. బ్రహ్మాత్వంలో ఏకత్వం సాధించినవాళ్ళే భార్యాభర్తలు. ఆ ఏకత్వంలో వెయ్యేళ్ళు చిరంజీవులై వర్ధిల్లండి...వస్తా !

[బయటకు వెళ్ళిపోయాడు...రంగనాథం తండ్రిని అనుస రించాడు. రాధ వాకిలిదాకా వెళ్ళి కన్నీరు తుడుచు కుంటూ, తిరిగివచ్చి డ్రాయరుమీదున్న డబ్బు తీసి కొని, సూటుకేసు తెరచి అందులో పెట్టబోయింది. శేషు వెనకనుండి వచ్చి రాధచేతిలోని డబ్బు లాక్కు న్నాడు. రాధ త్రుళ్ళిపడి వెనక్కు చూచింది. శేషు పెద్దగా నవ్వాడు. రాధ పట్టుకోబోయింది. రాధను విసురుగా నెట్టాడు. క్రిందపడిపోయింది. శేషు బయటకు వెళ్ళిపోయాడు. రాధ క్షణకాలం అలాగే నిలబడి పోయింది. చేసేదిలేక, తన బట్టలన్నీ సూటుకేసులో సర్దుకుంది. సూటుకేసు తీసికొని బయలుదేరింది. రంగ నాథం వాకిట్లో ఎదురైయ్యాడు...]

రంగ : వెళ్లిపోతున్నావా ?

రాధ : ఇక ఉండలేను.

రంగ : ఎందుకని ?

రాధ : నేనేమీ చెప్పలేను. నన్ను అడక్కండి.

రంగ : నీవు చెప్పలేవు; చేయగలవు. ఎందరి బ్రతుకులనైనా

నాశనం చేయగలవు. ఎన్ని సంసారాలైనా కూల్చి వేయగలవు. ఎందరినైనా ఏడిపించగలవు.

రాధ : మీరు నన్ను అర్థంచేసుకోవటంలేదు.

రంగ : అర్థంచేసుకుంటే ఇంత అనర్థాన్ని తెచ్చిపెట్టుకోక పోదును. నీవు మంచిదానివని, మనస్సు ఇచ్చావని, పెళ్లిచేసుకున్నాను.

రాధ : మీకు భార్యగా ఉండే అదృష్టాన్ని నేను నోచుకో లేదు.

రంగ : లేదు. నన్ను అదృష్టహీనుణ్ణిచేసి, వెళ్లిపోవటమే నీ ఉద్దేశ్యం.

రాధ : మీరు పొరబడుతున్నారు.

రంగ : ఇంతకంటే జీవితంలో ఇంకే పొరబాటు చేయలేను.

రాధ : నన్ను వెళ్ళనివ్వండి.

రంగ : ఈ ప్రాణముండగా జరగదు.

రాధ : మీరు సుఖపడలేరు.

రంగ : ఆ సుఖం ఏనాడో పోయింది.

రాధ : పోలేదు, మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోండి.

రంగ : పెళ్ళి చేసుకోగలను; ప్రేమించలేను.

రాధ : ప్రేమకోసం జీవితం పాడుచేసుకుంటారా ?

రంగ : జీవించటంకోసం ప్రేమను బలిపెట్టలేను. మర్యాదగా లోనికి వెళ్ళు.

రాధ : వెళ్ళను.

రంగ : చస్తావ్ !

రాధ : చచ్చినాసరే !

రంగ : తెగించావా ?

రాధ : ఆc.

రంగ : రాస్కెల్, నా బ్రతుకు గుగ్గిపాలుచేసి, నన్ను అన్యాయంచేసి, ఇప్పుడు వాడితో లేచిపోతున్నావా ? (విసురుగా నెట్టాడు. రాధ క్రిందపడిపోయింది. సూటు కేసు దూరంగా పడింది.) ఆ ఏడు వేలు ఎక్కడ పెట్టావ్ !

రాధ : లేవు !

రంగ : ఇచ్చావా !

రాధ : బలవంతంగా తీసుకు వెళ్ళాడు.

రంగ : నీవెందుకు అడ్డుపెట్టలా ?

రాధ : నాకు సాధ్యంకాలేదు. నామాట నమ్మండి.

రంగ : వాడికి ముందు డబ్బుఇచ్చిపంపి, నీవు వెనుక చెప్పకుండా వెళ్ళటం సాధ్యమయిందా ? తే! ఆ డబ్బు ఇలా తే ! నీవూ వాడూ కలిసి చేస్తున్న నాటకం నాకు తెలుసు. ఆడబ్బు ఇవ్వకపోతే, నీప్రాణాలు నీకు దక్కవ్. (వెనుక నుండి శేషువస్తూ...)

శేషు : ఏంచేస్తావ్ ?

రంగ : మీఇద్దరినీ సర్వనాశనం చేస్తాను.

ప : ఆపని నీవు చేయలేవు. నీచేతకాదు. అది చేయవలసింది నేను.

ధ : నాకోసం మీరిద్దరూ ఏమీ చేసుకోవద్దు. నాదారిని నన్ను వెళ్ళనివ్వండి. మీకు పుణ్యముంటుంది. మీ ఇద్దరికాళ్ళూ పట్టుకుంటాను. మిమ్మల్ని వేడుకుంటాను. నన్ను చంపండి, నేనేగా ఇందుకు కారణం.

ఘు : నీవుకాదు, వీడు.

గ : నేనుకాదు, నీవు.

ఘు : అవును, నేనే; మీఇద్దర్నీ తుదముట్టించాలని, చాలా కాలంగా ఆలోచిస్తున్నాను. అది నెరవేరలేదు. ఈవేళ మంచి సమయందొరికింది. మీపాపం పండింది.

గ : నీవు తక్షణం బయటకు వెళ్ళు.

ఘు : వెళ్ళకపోతే ?

ధ : ఏమండీ !

గ : నీవుండు. వెళతావా పోలీసుల్ని పిలవమంటావా ?

ఘు : పిరికివెధవా ! నే నెవరనుకుంటున్నావురా ? మిలిటరీ వాణ్ణి. ఈ చేతుల్తో ఎందర్నో చంపాను. నిన్ను చంపడం ఒక లెక్కకాదు.

ధ : మామా ! వారినేమనద్దు, వారు నిరపరాధులు. వారిని ప్రేమించింది నేను, పెళ్ళిచేసుకుంది నేను.

శేషు : అవును చేసుకున్నాన్ ! నీవు నాదానివని, మీ అయ్య నాదగ్గర ఓలీకూడా పుచ్చుకున్నాడు. కుటుంబంజరక్క - మిలటరీలోకి వెళ్ళాను. పదిసంవత్సరాలు అక్కడినుండి రాలేకపోయాను. మిత్రరాజ్యసమితి పర్యవేక్షణక్రింద ఏర్పడిన మిలటరీదళంలో నేను కొరియా వెళ్ళాను; కాంగో వెళ్ళాను. యుద్ధంలో ప్రమాదవశాత్తు ఈ కాలు పోగొట్టుకున్నాను. కొన్నాళ్ళు హాస్పిటల్‌లో ఉన్నాను. మొన్న మూడు మాసాలక్రితం, ఇండియాకు వచ్చాను. ఇంటికి వెళ్ళాను. మీఅయ్యలేడు, చని పోయాడట; నీవు లేవు, పెళ్ళిచేసుకొని వెళ్ళావట; పగపట్టి తిరిగాను; చివరకు మీ ఇద్దర్నీ పదిహేను రోజులక్రితం చూశాను. చూచినప్పుడే, నరికివేద్దామను కున్నాను. కాని చెయ్యాడలేదు. మీరిద్దరూ ఆనందంగా తిరుగుతుంటే, అసూయతో నా మనస్సు తగలబడి పోతుంటే, మిమ్మల్ని ఎలా ఏంచేయాలని అహో రాత్రులు ఆలోచించుకుంటూ తిరిగాను. ఈవేళ ఇక విడిచిపెట్టను.

రాధ : ఇందులో నాతప్పేముందో నీవే చెప్పు. నీవు మిలిటరీకి వెళ్ళావు. చాలాకాలందాకా తిరిగిరాలేదు. నీవు తిరిగి రావని అయ్య నిరాశపడ్డాడు. వయసువచ్చిన పిల్లను ఇంట్లో ఉంచనివ్వనన్నాడు. ఎవరి కొకళ్ళకిచ్చి తన బరువూ బాధ్యతా వదిలించుకుంటూ

నన్నాడు. గోలపెట్టడం మొదలుపెట్టాడు. గవర్నమెంటు ఆఫీసులో టైపిస్టుగా చేరాను. అప్పుడే వీరిని చూశాను. కొన్నినాళ్ళు స్నేహంగా ఉన్నాము. మాకు తెలియకుండానే మేమిద్దరము ప్రేమతో బంధింపబడ్డాము. చివరకు వివాహం చేసుకున్నాము. నీవు మిలటరీలో మరణించానని టెలిగ్రామ్ వచ్చింది. మమ్మల్ని ఎందుకు బాధపెడతావ్? ఇది నీకు న్యాయమేనా? చెప్పు మామా! చిన్నప్పుడు నన్నెంతో ప్రేమగా చూసేవాడివి. నేను ఏంకావాలన్నా తెచ్చిపెట్టేవాడివి. ఇపు డెందుకు ఇలా మారిపోయావ్? నేను సుఖపడుతుంటే నువ్వు చూడలేవా? చెప్పు మామా!

రంగ : వెళ్ళండి. మీరిద్దరూ ఇక్కడనుంచి వెళ్ళిపోండి. ఇక నా మనస్సును తగలెట్టకండి. కులపువాళ్ళంతా ఇది కూడదన్నారు. కోరి ప్రేమించి, కట్టుకున్నాను. తల్లీ దండ్రీ ఎడబాసినా, బ్రాహ్మణ్యం తగలడినా, సంఘాన్ని ఉద్ధరించాననీ, కులభేధాలు రూపుమాపాననీ, సంఘసంస్కర్తననీ, ఇంతకాలం విర్రవీగాను. నాగర్వం రాలిపోయింది; నాతల వాలిపోయింది; అంటరానివాళ్ళను ఉద్ధరించబోయి అధఃపతితున్నయ్యాను. రాధ నీ సొత్తయితే నీవు తీసుకువెళ్ళు. నన్ను వేధించకు, పీడించకు. ఒక వరలో రెండు కత్తులుండలేవు. సంఘాన్ని సంస్కరించగలముగాని, మనుష్యుల్ని, మనసుల్ని సంస్కరించటం నాకు చేతకాదు. వెళ్ళండి.

రాధ : నేను వెళ్ళను.

రంగ : వెళ్ళవ్వా...పిశాచీ...నా ప్రాణం తీస్తావా ! నేను బ్రతకటం, నీకిష్టంలేదా ? చెప్పు !

రాధ : నేనుకాదు చెప్పవలసింది...మామా ! కూడిన నా కాపురం కూలదోస్తే నీకు ఒరిగేదేమిటి ? కళకళలాడు తున్న నా బ్రతుకును కాలరాస్తే, నీకు కలిగే సంతోషం ఏమిటి ? నాభర్తకూ నాకూ ఎడబాటుచేసి, నన్నిలా క్షోభపెట్టి నీవు పొందే ఆనందమేమిటి ? అయిన వాడివికదా అని ఆదరించాను. కాలులేదని జాలి పడ్డాను. నీతప్పు నీవే తెలుసుకుంటావని నెమ్మదించాను. పరాయివాడిభార్యను పాములా వెంటాడ తావా ? వెళ్ళు ! నాఇంట్లోనుంచి వెళ్ళిపో ! లేదా, ఆ కత్తితో నన్ను చంపి నీపగ చల్లార్చుకో !

రంగ : ఇహ, ఈ అల్లరి నే భరించలేను. ఇక మీరు మర్యాదగా వెళతారా వెళ్ళరా ?

శేషు : వెళ్ళను, వెళ్ళంకూడా.

రంగ : ఎందుకు వెళ్ళవు ?

శేషు : ఎందుకు వెళ్ళాలి ? నాకావలసినదాన్ని నీదాన్ని చేసుకున్నావ్ ! నా అదృష్టాన్ని దోచుకున్నావ్, రాధ కోసమే జీవించాను, రాధకోసమే తిరిగివచ్చాను. రాధ నాదే :నని గర్వించాను. నిజమే, నేను చిన్నప్పుడు రాధను ప్రేమించవచ్చు. రాధ నాదేనని ఊహించ

నచ్చు. కాని, ఆమెకూ హృదయం ఉందనీ, ప్రేమించే మనస్సూ, పెళ్ళిచేసుకునే హక్కూ ఉందనీ, నేనాలోచించలేదు, నా ద్వేషం, నావిజ్ఞతను పోగొట్టింది, నా వివేకాన్ని మంటకలిపింది, అందుకే మీమీద పగపట్టాను. మిమ్మల్ని అనుక్షణం వేధించాను, మీ వెంటపడ్డాను. నిన్ను చంపి, నా రాధను లేవనెత్తుకుపోదామనుకున్నాను...కాదు, రాధనే చంపి నాపగ చల్లార్చుకుందామనుకున్నాను. కాని నాజీవితానికి, నా ప్రేమకు, నాభగ్నహృదయానికి ఎన్ని చేసినా ఇక శాంతిలేదు. నేను కుంటివాడిని. వికలాంగుణ్ణి. అదృష్టాన్నీ, అనయాల్నీ పోగొట్టుకున్నవాణ్ణి. ఒకవేళ రాధను నేను బలవంతంగా ఎత్తుకుపోయినా, ఆమె కోర్కెలను నేనెలా తీర్చగలను? ఆమె ఆశల్ని నేనెలా తీర్చగలను? ఆమె నెలా సుఖపెట్టగలను? నాకీ ప్రపంచంలో జీవించే అధికారంలేదు. నేను వ్యర్థుణ్ని. అనామకుణ్ని. ఆత్మీయులు లేని అనాథను. చెప్పండి, ఈ కత్తికి మిమ్మల్ని బలిచేసి నేనూ పోతాను. మనశ్శాంతిగా పోతాను. నాకక్ష తీర్చుకుంటాను. నాకులేని ఈ ఆనందం మీరనుభవిస్తూంటే చూచే హృదయం నాకులేదు. నేను రాక్షసత్వం మూర్తీభవించిన నరకుణ్ని. అలా బెదిరిపోతారేం. ఆగండి, ప్రాణంపోతుందని భయమా! (వికటాట్టహాసం) ఈవేళ నాచేతిలో మీరిక జీవించలేరు.

రాధ : మావాఁ! చంపు. ఆకత్తితో నన్ను చంపు. వారిని విడిచి పెట్టు. (కాళ్ళపెన వేసుకుంది.)

రంగ : కాదు. రాధనుకాదు. ఈపాపం నాది. నీగుండెల పొడిచినవాణ్ని నేను. నన్ను చంపు. (కాళ్ళమీఁ పడ్డాడు.)

శేషు : (భయంకరంగా నవ్వుతూ) చంపుతాను. మీ ఇద్దరినీ నాశనంచేస్తాను. (వాళ్ళను పొడవబోయినట్టు నటించి తానే పొడుచుకున్నాడు.)

రాధ : మాఁవా !

రంగ : శేషూ !

శేషు : నన్ను తాకకండి...హాయిగా నన్ను చనిపోనివ్వండి నాపగ నన్నే దహించివేసింది. నాద్వేషం నన్నే బూడిదపాలు చేసింది. ఇక మీకు ఎవ్వరిఅడ్డంకూ లేదు సుఖంగా బ్రతకండి...మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను (ప్రాణంవిడిచాడు.)

రాధ : మాఁవా !

రంగ : శేషూ !

[ఇద్దరూ శవంమీదపడి దుఃఖిస్తున్నారు.]

[తెర]